సువాసన పరిసరంలో అలముకుని ఉండేది. ఈ అద్భుతమైన జల యాత్రను చూడ్డానికి ప్రజలు ఇసుక వేస్తే రాలకుండా వచ్చేవారు. యాంగ్ మహారాజు కాలువకు రెండు వైపులా అక్కడక్కడా ప్రాసాదాలను కూడా నిర్మించాడు.

ఈ మహా వైభవోపేతమైన అద్భుత జలయాత్రను నేను నా కండ్లతో చూస్తున్నాను. కానీ, ఆనందించ లేక పోతున్నాను. ఒకే ఒక ప్రశ్న నా బుర్రలో మారు మ్రోగుతోంది. "ఈ కాలువను త్రవ్వి ఈ విభవాన్ని సృష్టించిన మానవులకు ఈ జల యాత్ర వల్ల ఏమైనా ప్రయోజనం కలిగిందా? వారి దుఃఖం ఏమాత్రమైనా శమించిందా?"

నేను ఛాంగ్-అన్‌కు వచ్చిన మూడు సంవత్సరాలకు జిన గుప్తుడు కూడా ఛాంగ్-అన్‌కు వచ్చాడు. అన్ని విషయాలలోనూ మా ఇద్దరి భావాలూ కలుస్తుంటాయి. ఈ అతి వైభవం అతడి మనస్సునూ బాధించింది. జ్ఞాన గుప్తుడికి ఈ ఆడంబరం నచ్చలేదు. ఎవరికి నచ్చినా నచ్చక పోయినా ఉత్తర దక్షిణ దేశాలను ఏకం చేయాలని పట్టుపట్టిన యాంగ్ చక్రవర్తిని ఎవరు ఆపగలరు? ఏమైనప్పటికీ చావూ వంశపు ఘోర అత్యాచారాలకు గురియైన బౌద్ధ మతానికి తిరిగి ప్రాణ ప్రతిష్ట చేశాడు యాంగ్ చక్రవర్తి.

జినగుప్తుడు నేను పుట్టిన పది సంవత్సరాలకు పురుషపురంలో జన్మించాడు. వయస్సులో నా కంటె చిన్నవాడు కావడం వల్ల నన్ను సొంత అన్నగారిలా భావించేవాడు. నేను మాత్రం అతణ్ణి విద్యా జ్యేష్ఠుడనుకునే వాడిని. అతడి తండ్రి రాజోద్యోగి. బుద్ధ భక్తుడు కావడం వల్ల కొడుకును ఏడవ ఏటనే మహావన విహారంలో శ్రమణుడిగా చేర్పించాడు. వయస్సు వచ్చాక జిన యశుడు ఉపాధ్యాయుడుగా, జ్ఞానభద్రుడు ఆచార్యుడుగా భిక్షు దీక్షను స్వీకరించాడు జినగుప్తుడు. త్రిపిటకాలనూ పఠించాడు. కవిత్వ అభిరుచి కూడా బాగానే వుంది. 27 సంవత్సరాల

వయసొచ్చాక మత ప్రచారార్థం విదేశ యాత్రల్ని ప్రారంభించాడు. మొదట గాంధార దేశాన్నుండి కపిషాకు వెళ్ళాడు. అక్కణ్ణుంచి హిమాలయాన్ని దాటి కాంశ్య దేశంమీదుగా చీనాదేశానికి రావాలని సంకల్పించుకున్నాడు. సంకల్పాన్ని కార్యరూపంలో పెట్టాడుకూడాను. మొత్తం పదిమంది ఈ యాత్రలో పాల్గొన్నారు. కానీ, ఛాన్ చావూ వరకు వచ్చేసరికి నలుగురు మాత్రమే మిగిలారు. ఆరుగురు చనిపోయారు. జినగుప్తుడు మూడు సంవత్సరాలపాటు ఈ ఛాన్ చావూలో వున్నాడు. తరువాత చావూవంశపు చక్రవర్తి మింగ్ పరిపాలిస్తున్న సమయంలో ఛాంగ్ అన్‌కు వచ్చి, చావూ-యాంగ్ విహారంలో దిగాడు. మొదట్లో సుఖంగా గడిచినా, తరువాత చీనాదేశాన్ని వీడి వెళ్ళవలసిన వాడయ్యాడు. (క్రీ. శ. 672-82లో) తోర్యుర్క-రాజ్యం గుండా మాతృదేశానికి ప్రయాణం చేశాడు. తోర్యుర్క-మహారాజయిన తోపాఖాన్ జినగుప్తుణ్ణి తన రాజ్యంలో వుండి ధర్మప్రచారం చేయవలసిందని ప్రార్థించాడు. జినగుప్తుడు తన అనుచరులైన జినభద్ర, జినయశులతో తోర్యుర్క-రాజ్యంలో పదిసంవత్సరాలు వున్నాడు. ఇంతలో చావూ వంశం పతనమైందనీ,సు-ఈ వంశం అధికారాన్ని చేపట్టిందని తెల్సింది. మళ్ళీ వెనక్కు తిరిగి చీనాదేశానికి వచ్చాడు. వెనుక యీ దేశంలో వున్నప్పుడు మూడు వేల శ్లోకాలుగల నాలుగు గ్రంథాలను అనువాదం చేశాడు. ఈ మాటు కూడా జినగుప్తుడు తన సమయాన్నంతా అనువాదంకోసమే వినియోగించాడు. జినగుప్తుడు గొప్పపండితుడు. చీనీ, తుర్కీ-రెండు భాషల్లోనూ అతడు అపారంగా జ్ఞానాన్ని సంపాయించాడు. నేను మొత్తం 15 గ్రంథాలను అనువాదం చేశాను వాటి మొత్తం శ్లోకాలు సంఖ్య 50 వేలుంటుంది. జినగుప్తుడు 175 లక్షల 50 వేల శ్లోకాలను అనువాదం చేశాడు. అశ్వఘోషుడి బుద్ధ చరితాన్ని అతిసుందరంగా అనువాదం చేశాడు. పాఠకులకు మూలగ్రంథాన్ని చదువుతూన్న అనుభూతి కలుగుతుంది. "సద్ధర్మ పుండరీకం" లాంటి సూత్రాలను కూడా ఎన్నిటినో అనువాదం చేశాడు. నేనీ మాటు ఛాంగ్-అన్‌కు వచ్చాక అనువాదాల్ని చేయలేదు. వెనుక

చేసినవే 45 వేల శ్లోకాలుగల ఎనిమిది గ్రంథా లున్నాయి. వాటితోనే సంతృప్తిపడి వూరుకున్నాను. *

ఒక్క జినగుప్తుడూ, నేనే కాదు వేల సంఖ్యలో భారతీయ బౌద్ధ భిక్షువులు చీనా దేశానికి వచ్చారు. మత ప్రచారాన్ని చేశారు. ఇన్ని వేల మంది అనువాదాలే చేయలేదు. కొందరు వైద్యులుగా పరులకు సేవచేస్తూ జీవితాన్ని గడిపారు. కొందరు అధ్యాపక కార్యాన్ని నిర్వహించారు. మరి కొందరు కేవలం ఉపన్యాసాల నిస్తూ ధర్మ ప్రచారానికి సహకరించారు. గ్రంథానువాదాల్ని చేయకపోయిన మాత్రాన వీరిని మర్చిపోవడం తగదు. మేము అనువాదం చేసిన గ్రంథాల్లో ఏవైనా భవిష్యత్తరాల వారికి లభించి, చీనా దేశంలో జరిగిన బౌద్ధమతప్రచారం సందర్భంగా మమ్మల్ని జ్ఞాపకం చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడ్డప్పుడు, అనామకులుగా, అసంఖ్యాకులుగా వున్న పై భిక్షువుల్ని కూడా జ్ఞప్తికి తెచ్చుకోవడం ఉచితమూ, న్యాయమూ అనుకుంటున్నాను.

* * * *

---

*జినగుప్తుడు అనువాదం చేసిన గ్రంథాల్లో ఇప్పటికీ నిలిచివున్న గ్రంథాలు: 1. 'సద్ధర్మ పుండరీక' 2. 'నానా సంయుక్త మంత్రసూత్ర'. నరేంద్ర యశుడు అనువాదం చేసిన గ్రంథాలు: 1. సూర్య సూత్రం, 2. మంజుశ్రీ విక్రీడిత సూత్రం, 3. మహామేఘసూత్రం, శ్రీగుప్తసూత్రం, 5. బల వ్యూహ సూత్రం, 6. శతబుద్ధసూత్రం, 7 స్థిరమతి సూత్రం.

# ఉపసంహారం

నరేంద్రుడిక లేడు. ఇహ జీవన యాత్రను చాలించాడు. వేన్-తీ రాజ్యానికి వచ్చిన ఎనిమిదవ సంవత్సరంలో (క్రీ. శ. 589) ఒకనాడు సహజంగా కూర్చున్నవాడు కూర్చున్నట్టు కన్ను మూశాడు. ఏ జబ్బూ లేదు. పండు పండి రాలినట్టయింది. నా పేరు జినగుప్తుడు. నా మీదవుండే ప్రేమ వల్ల నరేంద్రుడు నా గురించి పొగుడుతూ వ్రాశాడు. అతడిచే పొగడ్తల్ని పడసే యోగ్యత నా కేవిధంగానూ లేదని అనుకుంటున్నాను. అతడు చేసిన మహాయాత్రలముందు నా యాత్ర ఎంత? నేను పడ్డబాధలు మాత్రం ఏమున్నాయి? ఇక గ్రంథానువాదాలంటారా? ఆతడు తలచుకుంటే నాకంటె కూడా ఎక్కువ శ్లోకాలను అనువాదం చేసేవాడు. నరేంద్రుడు అవలోకితేశ్వరుడి లాగానే (క్వాన్-యిన్) దయాసముద్రుడు. అతడు తన యాత్రానుభవాల్ని, భవిష్యత్తరాలవారి ఉపయోగార్థం గ్రంథస్థం చేశాడు.

నరేంద్రుడు 'అజాత శత్రువు' అనతగినవాడు. నేను గాంధార దేశంలో పుట్టాను. నరేంద్రుడు ఉద్యానదేశవాసి. గాంధారం, ఉద్యానం రెండూ ఇరుగు పొరుగు దేశాలు. కనుకనే మా స్నేహం ఇంత ప్రగాఢమైంది. నరేంద్రుడి స్నేహాన్ని, వాత్సల్యాన్ని పొందటానికి అందరూ సమానులే. మానవుల పట్లేకాకుండా, సమస్త జీవరాసులపట్లా అతడు అపారమైన దయను ప్రదర్శిస్తుండేవాడు. కానీ అతడు నా పట్ల తన పొరుగు దేశస్థుడన్న ప్రత్యేకమైన శ్రద్ధనూ, అభిమానాన్నీ ప్రదర్శిస్తూండేవాడు. సమదర్శి, దయామయుడూ అయిన నరేంద్రుని గురించి పై వాక్యాన్ని వ్రాసినందుకూ, వ్రాయవలసి వచ్చినందుకూ చాలా బాధపడుతున్నాను అయినా, చంద్రుడిలోని మచ్చలా అతడి మహోన్నత వ్యక్తిత్వపు సౌందర్యాన్ని పై వాక్యం ఇనుమడింప చేస్తుందే గాని, హీనపరచదని అనుకుంటున్నాను.

నరేంద్రుడు చనిపోయాడన్న వార్త క్షణంలో రాజధానిలో వ్యాపించింది. రాజధానిలో ప్రజలందరూ శవయాత్రలో పాల్గొన్నారు. ఖిన్న వదనులై, సాశ్రునేతాలతో అందరూ శవం వెంట నడిచారు.

శవయాత్రలో పాల్గొన్న వాళ్ళల్లో వివిధ వర్గాలకూ, వృత్తులకూ, చెందిన వారే కాక, వివిధ దేశాల ప్రజలు కూడా వున్నారు. త్యోయిర్క, కూచీ కుస్తన్, తుఖార్ మొదలుగా గల అనేక దేశాల ప్రజలు కన్నీరు కారుస్తూ శవయాత్రలో పాల్గొన్నారు. నరేంద్రుడి శవానికి యథావిధిగా దహనక్రియలు జరిపాము. అతడి అస్థి ధాతువుతో స్తూపాన్నొక దాన్ని నిర్మించాము. అతడి జ్ఞాపకాలను శాశ్వతం చేయడానికి అవసర మైన జాగ్రత్తలను తీసుకున్నాము. నరేంద్రుడు లేడుకనుక సరిపోయింది. అతడుంటే మమ్మల్నిలా చేయనిచ్చే వాడుకాదు. అతడికి శాశ్వతత్వం మీద నమ్మకం లేదు. క్షణికవాది. సర్వప్రాణులూ సుఖంగా వుండా లన్నదినరేంద్రుని మహోన్నత ఆదర్శం.

